మ్యాక్ఫేడన్, బెర్నారు

ఆరోగ్యము - కామేచ్ఛ

బెజవాడ, 1929

Myākphēḍan, Bernāru

Ārōgyamu - kāmēccha

Bejavāḍa, 1929

Record no. 643

# SUNDARAYYA VIGNANA KENDRAM

1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

మ్యాక్ఫేడన్, బెర్నారు.

ఆరోగ్యము - కామేచ్ఛ / వ్యాసకర్త బెర్నారు మ్యాక్ఫేడన్.- బెజవాడ : ప్రకృతి కార్యాలయము, 1929.

14 p. ; 19 cm.

Record no. 643

Myākphēḍan, Bernāru.

Ārōgyamu - kāmēccha / vyāsakarta Bernāru Myākphēḍan.- Bejavāḍa : Prakṛti Kāryālayamu, 1929.

14 p. ; 19 cm.

Record no. 643

35 mm microfilm

Image placement: IA IIA IB IIB        Date filming began: 23 January, 2006

ప్రకృతి గ్రంథమాల 36.

# ఆరోగ్యము - కామేచ్ఛ

వ్యాసకర్త:

డాక్టరు బెర్నారు మ్యాక్ఫేడన్

అనువాదకులు:

శ్రీమతి జ్ఞానాంబగారు.

ప్రకాశకులు:

ప్రకృతికార్యాలయము, బెజవాడ.

బెజవాడ:

ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

1929.

ఇతరులకు వెల రు 0-12-0.

ప్రకృతిచందాదారులకు 0-9-0.

సంవత్సరచందా రు 3-0-0

# ప్రకృతి

మాదిరిసంచిక రు 0-4-0

స్వాభావిక ఆరోగ్య సచిత్ర వైద్య మాసపత్రిక.

---

మానవులకు వ్యాధులు రాకుండునట్లు సృష్టిలోనుండు తక్కినజీవుల వలె నెటుల స్వాభావిక జీవనము చేయవలయునో, ఏయే ఆరోగ్య సూత్రముల ననుసరించి పరమావధిని పొందవలెనో బోధించును. వ్యాధి వచ్చిన తరువాత మందుశస్త్రములకుకూడ లొంగని దైహిక, మానసిక వ్యాధులను, స్వభావ సిద్ధములగు మట్టి, ఆహారము, నీరు, గాలి, సూర్యకిరణములు, యోగ, వ్యాయామ, ఉపవాస విద్యుత్కాంతుల కి మొదలగు వాని సాహాయ్యమున చికిత్సల చేయువిధమును, అటుల వ్యాధి కుదిరినవారి చరిత్రలను, నిర్వికార (ఋషి) జీవనమును వివరించును. ప్రస్తుత మానవులు నాగరకత అనుకొని అజ్ఞానవశమున చేయు దుష్కార్యముల తీవ్రముగా ఖండించును. చందాదారులకు ప్రకృతివైద్యపుస్తకము లన్నియును తగ్గింపు ధరలకు వేయబడును.

---

ప్రకృతిచందాదారులకు రు 2-8-0;

# తొట్టివైద్యము

ఇతరులకు రు 3-0-0

ఇందులో కూనేగారి "అభినవ వైద్యశాస్త్రము, ముఖవైఖరీ విద్య, రోగారోగ్య వివేకము, శిశుపోషణము" అను గ్రంథములలోని ముఖ్యవిషయములన్నియు గలవు. ఇందులో 70 పటములు, 4 భాగములు, 34 అధ్యాయములు, 5 అనుబంధములు-వెరసి 400 పుటలు గలవు. చక్కని బైండు. క్రొత్తకూర్పు. అనేకనవీనవిషయము లిందు చేర్పబడినవి.

---

ప్రకృతి కార్యాలయ ట్రస్టు: బెజవాడ

ప్రకృతి గ్రంథమాల 36.

# ఆరోగ్యము-కామేచ్ఛ

వ్యాసకర్త:

డాక్టరు బెర్నారు మ్యాక్ఫేడన్

అనువాదకులు:

శ్రీమతి జ్ఞానాంబగారు.

ప్రకాశకులు:

ప్రకృతికార్యాలయము, బెజవాడ.

బెజవాడ:
ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు
ముద్రింపబడియె.
1929.

ఇతరులకు వెల రు 0-12-0.
ప్రకృతిచందాదారులకు 0-9-0.

సంవత్సరచందా
రు 3-0-0

# ప్రకృతి

మాదిరిసంచిక
రు 0-4-0

స్వాభావిక ఆరోగ్య సచిత్ర వైద్య మాసపత్రిక.

---

మానవులకు వ్యాధులు రాకుండునట్లు సృష్టిలోనుండు తక్కినజీవుల వలె నెటుల స్వాభావిక జీవనము చేయవలయునో, యేయే ఆరోగ్య సూత్రముల ననుసరించి పరమావధిని పొందవలెనో బోధించును. వ్యాధి వచ్చిన తరువాత మందుశస్త్రములకుకూడ లొంగని దైహిక, మానసిక వ్యాధులను, స్వభావ సిద్ధములగు మట్టి, ఆహారము, నీరు, గాలి, సూర్యకిరణములు, యోగ, వ్యాయామ, ఉపవాస విద్యుత్కాంతులకు మొదలగు వాని సాహాయ్యమున చికిత్సల చేయువిధమును, అటుల వ్యాధి కుదిరినవారి చరిత్రలను, నిర్వికార (ఋషి) జీవనమును వివరించును. ప్రస్తుత మానవులు నాగరకత అనుకొని అజ్ఞానవశమున చేయు దుష్కార్యముల తీవ్రముగా ఖండించును. చందాదారులకు ప్రకృతివైద్యపుస్తకము లన్నియును తగ్గింపు ధరలకు వేయబడును.

---

ప్రకృతిచందాదారులకు
రు 2-8-0;

# త్రోటివైద్యము

ఇతరులకు
రు 3-0-0

ఇందులో కూనేగారి "అభినవ వైద్యశాస్త్రము, ముఖవైఖరీ విద్య, రోగారోగ్య వివేకము, శిశుపోషణము" అను గ్రంథములలోని ముఖ్యవిషయములన్నియు గలవు. ఇందులో 70 పటములు, 4 భాగములు, 34 అధ్యాయములు, 5 అనుబంధములు-వెరసి 400 పుటలు గలవు. చక్కని బైండు. క్రొత్తకూర్పు. అనేకనవీనవిషయము లిందు చేర్పబడినవి.

---

ప్రకృతి కార్యాలయ ట్రస్టు: బెజవాడ

# ఆరోగ్యము — కామేచ్ఛ

(డాక్టరు బర్నారు మ్యాక్ఫేడన్, న్యూయార్కు).

ఆరోగ్యము కామేచ్ఛలను రెంటిని నొకవిషయమున జేర్చి చర్చించుట కడువిచిత్రముగనున్నదని యనేకులు భావింతురు. మానవ జీవితములో నారోగ్యము మిక్కిలి యమూల్యమైన యాస్తిని బోలియున్నది. ఇయ్యది యెల్లరెరింగిన సంగతియే. అయినను మీలో ననేకులీ విషయమును బాగుగ నెఱుంగరని యనుకొందును. మీరింకను దీనినిగూర్చి పూర్ణముగ నేర్చుకొనవలసి యున్నది. ఎవ్వరి కారోగ్యములేదో, జీవితాశను గోల్పోయి యుండుటన నేమియో యనువిషయమును స్వానుభవమున నెవరెరింగి యుందురో, వారికిమాత్రమే, ఆరోగ్యము జీవితములోని యతివిలువగల యాస్తియని దెలియును. మానవుని యందలి కామేచ్ఛ, ప్రబలశక్తిని సూచించుచున్నది. కామేచ్ఛను గూర్చి యనేకులు పరిహాసోక్తు లాడుదురు. అందు పరిహాసించదగిన దెద్దియును లేదు. అయ్యది హాస్యమునకు విషయముకాదు. దానినిగూర్చి పరిహాసించి పలుకుచున్న వారి హృదయాంతరాళమును బాగుగ వెదకిచూచితిరేని, వారియందు సైతమిది యుపేక్షింపరానిదియు, గంభీరమైనదియు, నగు విషయమను భావమును గనుంగొనగలరు. మనోవికారమగు నీకామము కఠిన హింసలకు, అధికబాధలకు హేతుభూతమై యుండుటను మీరు తెలిసికొనగలరు.

ఈకామము క్రమమైన స్థితియందుండెనేని, జగత్తున బొందదగిన సకల సౌఖ్యములను మానవునకు బ్రసాదించును.

జీవితమును సౌందర్య వంతముగను, ఆనంద మయముగను జేయును. జీవిత ముండవలసినరీతిగ నుండుటకు వలయు సమస్తమును బ్రసాదించును. కాని యీదివ్యవరములను కడుపరుదుగ నొసగుచున్నది. అనేకుల జీవితములలో నిది దుఃఖమునే గలిగించు చున్నదనియు, నొక్కొక విషయములో భరింపరానిబాధలను గలిగించుచున్నదనియు మీరెల్ల రెఱుంగుదురు.

కామేచ్ఛ చాలమట్టుకు దేహారోగ్యాధీనమైయున్నది. నేనిప్పుడొక యమోఘవిషయమును గూర్చి చెప్పబోవుచున్నాను. మీలో కొందరు దీనిని సమ్మకపోవచ్చును గాని స్త్రీపురుషుల కామేచ్ఛ యంతయును పశుత్వమే పునాదిగా నున్నది. ఆయిచ్ఛ స్థూలేంద్రియముల నుండి జనించుచున్నది. అయ్యది స్థూలశరీర సంబంధమైనది. ఇది చాలవరకు కొందరిచే వ్యవహరింప బడుచున్నట్టుగా, నీచ ప్రకృతివలన నునికి గలిగి యున్నది. స్వభావముచేత నీయిచ్ఛ స్థూలశరీర సంబంధమైనదిగ నున్నదిగావుననే మానవుని స్థూలశరీర స్థితివలన (దేహారోగ్యమువలన) బలవత్తరమగు మార్పులను జెందుచుండునని విస్పష్టమగుచున్నది. జీవితముయొక్క సర్వావస్థలయందు నారోగ్యమవసరము. కామేచ్ఛ తనకు సహజమగు సకల కార్యములను క్రమముగ నిర్వర్తింపవలెననిన నారోగ్య మత్యంతావశ్యకము.

ఎందరెందరో ధనముకొఱకు, వసతికొఱకును, కార్యసిద్ధికొఱకును వివాహ మాడుచున్నారు. వధూవరులయందు ప్రేమ స్వాభావికదశయం దుండెనేని యిట్టి వివాహ మొక్కటియైన జరిగియుండదు. అనగా గొప్ప పరిమాణముగల దేహ



దార్ఢ్యము గలిగియుండిరేని ప్రతి విషయమందును స్వాభావిక దశయందుండిన స్త్రీ పురుషులైరేని వారి కామేచ్ఛ సహజావస్థయం దుండెనేని, ధనముకొఱకు వివాహమాడజాలరు. పూర్ణత్వముయొక్క యుత్కృష్ట పరిణామ దశవరకు ననురాగము వికాసమును బొందినపుడు స్త్రీ పురుషుల యమూల్యాధికారమగు పరస్పర వరణమునకు దోడ్పడునట్టి సహజజ్ఞానమును బ్రసాదించును. వికసనము నొందిన కామేచ్ఛతో నడపబడువారెన్నడును భ్రమప్రమాదులకు లోనుగారు.

కామేచ్ఛలోని కారోగ్యము ప్రవేశించును. ప్రవేశించుటేమి, యొకభాగముగా మారుచున్నది. ఈ విషయమును గూర్చి యెంత యెక్కువగా తెలిసికొనిన నంతమేలు. అనేకుల దృష్టికి కామేచ్ఛ తెలియబడక బూతులతో గప్పబడియున్నది. కామ విషయములనుగూర్చి ప్రసంగించుట నీచమనియు, పాపమనియు ననేకుల యభిప్రాయము. కామేచ్ఛయు, దానివలన గలుగు వివిధ మనోవికారములును లేకుండెనేని, మీరును నేనును నీజగత్తున నుండకపోయియే యుందుము. ప్రపంచమున పరమపవిత్రమైన విషయ మేదియైన నుండెనేని, అయ్యది కామేచ్ఛావిషయమే. ప్రతి మానవజీవియు తనను గ్రహణశక్తిగలిగిన క్షణమునుండి యీ విషయమును పూర్ణముగ దెలిసికొన యత్నింపవలయును.

ఒక విఖ్యాతస్త్రీ(mormons) మార్మన్సు అనువారి యసాధారణ విద్యా పద్ధతులనుగూర్చి వ్రాసిన విషయములను గొన్నిటిని జదివితిని. నేనిపుడు (mormonism) మార్మను మతమును ప్రతిపాదించుట లేదుగాని యామె వ్రాతలయందు

నిరూపింపబడిన కొన్ని యంశముల కచ్చెరువు బొందుచున్నాను. "వారి విద్యావిధానమున కంటె సిగ్గుకరమైనదియు, దారుణమైనదియునగు విషయమును నేను వినియుండలేదు. వివాహితలు మాత్రమే తెలిసికొనవలసిన సంగతులను నాలుగైదేండ్ల చిన్నపిల్లలకు బోధించుచున్నారు. ఔరా! ఎంతటి భయంకర విషయము!" అని యామె వ్రాసినది కాని మనలో బాలబాలికలవలె, వారు (మార్మనుల పిల్లలు) తమనుగూర్చిన నీచాభిప్రాయములతో కళంకితులుగాలేదని నేను సాహసించి చెప్పుచున్నాను. మనమొక గొప్పమార్పును సమీపించుచున్నామని నాయభిప్రాయము. ఎల్లెడలను స్త్రీపురుషులు జ్ఞానావశ్యకతను యెక్కువగా దెలిసికొన మొదలిడుచున్నారని నానమ్మకము. వారెంతయో బాధ ననుభవించిరి. తమ బిడ్డలును నట్టి బాధలకులోనగుట కవసరములేదని వారిపుడు దెలిసికొనుచున్నారు. క్రమమైన కామేచ్ఛ మానవుని జీవితమును పరిశుద్ధవంతముగ నొనర్చును. స్త్రీజీవితమునో యిందు మించుగా నీశ్వర విధానము ననుసరించియే నడుచునట్లుగా జేయును. ఈ కామేచ్ఛ యపవిత్రపరుపబడక యుండినయెడల మానవులు స్త్రీలుగాని పురుషులుగాని యుపమింపదగిన, జీవితప్రథమావస్థయందే తగినజతను వరింపగలరు. ఈ యిచ్ఛ కళంకరహితముగ నున్నచో, మంచి యాలోచనతో వరించుకొనగలరని నేను మరిమరినొక్కి చెప్పుచున్నాను. ఒండొరులను వరించుకొనిన స్త్రీపురుషు లిరువురు జీవితముయొక్క యంత్యక్షణమువరకు, నొకరినొకరు విడువకయుండుట సహజము. మానవ స్వభావమునందు పైశాచికత్వమును, దుష్టత్వమును అంతర్నిహితము



గానున్నవని పలువురు ముచ్చటింతురు. తనయిచ్ఛానుగుణ్యముగా నడిచినచో నేమానవుడును నీతివంతుడుగా నుండజాలడని యనెదరు. కాని స్త్రీపురుషులు తమ సహజకామేచ్ఛను నిష్కళంకముగ నుంచుకొని, యున్నత జీవనమును నడుపుకొనుచుంటిరేని, పరిశుద్ధముగను, నైతికముగను దక్క మరియొకరీతిగ వారి జీవితములు నడువనేరవు. వారొండొరుల యెడల యథార్థప్రేమ విశ్వాసములతో వర్తించుదురు. అందుకు భిన్నముగనుండుటకు వారికిచ్ఛయే జనింపదు. ఈకాలమున ప్రపంచమునగల యనేకదుఃఖములకును, దురవస్థలకును అస్వాభావికత నొందిన కామేచ్ఛయే ప్రధానకారణము. ధనలాభము నిమిత్తము వివాహము జరిగినపుడు వికృతినొందిన కామేచ్ఛాఫలితములను మనము బాగుగ గనుగొనుచున్నాము. ఒకస్త్రీని వివాహమాడినచో కొన్ని లాభములు గలవని యామెను వివాహమయ్యెడు పురుషుని, సంఘమునందౌన్నత్యము గలుగునని యొకపురుషుని వివాహమాడెడు స్త్రీని, యీయిరువురను జూచి మనము జాలిపడవలయును.

ఏవిధముగ వినియోగింపవలయునో తెలియనంత ధనముగలవాడు, భార్యకొఱకు వెదకుచుండినచో వానియెడల నాకు గడుసానుభూతిగలదు. సకలవిషయములందు నాతడు జయశీలుడై యుండవచ్చును సంఘమునందున్నతస్థాన మలంకరించి యుండవచ్చును, కాని అట్టివానికి కేవలప్రేమకొఱకు మాత్రమే వివాహమాడెడు స్త్రీ లభించుట సాధ్యమగునా? వీరివలె సమాన సిరిసంపదలుగల స్త్రీలకొఱకెల్లయెడల పురుషులెట్లు యత్నించుచున్నారో అట్లే యీతనికొఱకు

స్త్రీలు యత్నించుచుందురు. సాధారణముగా కేవల సుస్థితిని సాంఘికగౌరవము నపేక్షించు స్త్రీనే యితడు పెండ్లి యాడును. ఇట్టి స్థితిగతులలో నత్యల్ప సౌఖ్యమునకు మాత్రమే యవకాశముగలదు. సరియగు నియమముల కనుగుణమగు వివాహమువలన పొందదగినంత సౌఖ్యమంతయును గలుగును. నియమరహితమైన వివాహము శుద్ధనరకమే. మనము అంతట నిట్టినరకమునే గాంచుచున్నాము. జీవితభాగస్థుల(దంపతుల)ను వరించు కొనునపుడు, పూర్ణారోగ్యమే మూలముగాగల స్వాభావిక ప్రేమయొక్క యుద్భోధనల, ననుసరింతుమేని, మనమనంత సౌఖ్యము నొందగలము. అట్లుకాదేని శిక్షనొందవలయును. పలుమారు అపరాధమును చెల్లింపవలయును

భార్యాభర్తలు తరుచుగ కలహించుట మనము చూచుచున్నాము. పరిపూర్ణప్రేమతో వివాహమాడినవారిని గూర్చియోచింతము. అట్టివారియందు నయితమెన్నియో మనస్పర్థలుగలవు. వారికీకలహము లెందువలన గలుగుచున్నవి? కొంతవరకు వివాహానంతర మస్వాభావికతనొందిన కామేచ్ఛపై నీ నింద మోపవలసి యున్నది. అట్టి స్థితియందు నస్వాభావికనుగు నుద్రేకము కలుగును. ఆహార సంబంధముగా (అస్వాభావిక పదార్థసేవనమువలన) నిట్టి ఫలితములు గలుగును. కాని సాధారణహేతువుమాత్రము దేహధర్మమగు నీతిని జెఱుచు నమితభోగమే. కామేచ్ఛను సహజస్థితియందుంచుటకు పరిపూర్ణారోగ్య మవసరము.

కాబట్టి భార్యాభర్తలలో మనస్పర్థలు గలిగినచో నవి మితిమీరిన కామేచ్ఛవలన గలిగిన ఫలితములే. అనుభవపూ



ర్వకముగా ప్రతివారి విషయములో నింతియే. ఇంక ననేక కారణములుండవచ్చును. కాని యిదియే ప్రధానమైన, నిక్కమైన కారణము. స్త్రీపురుషు లిరువురు నొకరినొకరు విడువజాలనంత, గాఢప్రేమతో వివాహమాడినట్టియిన, నాబద్ధానురాగము యెడతెగకుండ నున్నచో, అట్టి భార్యాభర్తలలో, తగవులు, మనస్పర్థలు కలుగుట కవకాశమే లేదు. గృహస్థజీవనమునందు మనము ప్రతిచోట జూచుచున్న యసౌఖ్యమున కంతటికి నస్వాభావిక కామేచ్ఛయు, నధికసంభోగమును ముఖ్యకారణములు. పరిపూర్ణదేహారోగ్యమునకు వలయు నింద్రియపటుత్వమునకు సంబంధించిన ప్రకృతిధర్మముల నుల్లంఘించుటవలన తరుచుగా నసౌఖ్యము సంభవించుచున్నది.

ఒక్కొకనికి విషాదరోగమనబడు నంధకారము తరుచుగా సంభవించును. శరీర వ్యాయామము లేకపోవుటవలన రక్తప్రసరణ మాగిపోయి, జీర్ణక్రియ తగ్గి యజీర్ణమేర్పడును. ఈయజీర్ణమువలననే విషాదరోగము (ఎప్పుడును వ్యసనముగనుండుట) కలుగును. శరీరము కల్మషములతో నిండియున్నవానితో, నొక్క కఠినోక్తి నాడితిమేని తోకత్రొక్కిన తాచువలె చిఱ్ఱుసలేదును. అన్నివిషయములకు శరీరస్థితియే మూలము. మొత్తముమీద చిఱచిఱలాడెడు మగవాడుగాని అహంకారియై విరసోక్తులాడెడు నాడుదిగాని, వారి వారి దుష్టమనోవృత్తులను చెడురక్తమునుండియే పొందుచున్నారు. సంతోషముగ, నారోగ్యముగ, నాడుచు, పాడుచు జీవితానందములను పూర్ణముగా ననుభవించెడు చిన్నబిడ్డ లెన్నడును

కలహములాడరు. అట్లూహించుటకు గూడ వీలులేదు. ప్రతిజీవి పొందదగిన శారీరకస్థితి యిదియేనని యిట్టి చిన్నబిడ్డలస్థితి ప్రదర్శించుచున్నది. శ్రేష్ఠతరమగు నారోగ్య బలములున్నచో జీవిత మానందమయమగును. అట్టిస్థితియందు కలహ మసంభవమేగాక కష్టమును గూర్చి భావించుటకు చింతాలేశమైన నపుడు గలుగదు.

ఈ చెప్పబడిన విషయములందు మీకు నమ్మకము లేని యెడల యింటికేగి మీబంధువులలో కొందరిని పరిశీలించుడు. కొందరనవరత మహంకారపూరితులై యుందురు. తృప్తియను మాటయే యుండదు. ఎల్లపు డెవరో యొకరితో జగడమాడుచుండెదరు. అటువంటివారు, ప్రతిదిన ముదయమున నొక మైలుదూరము పరుగెత్తి, తరువాత చల్లనినీటిలో స్నానముచేసిరేని, రక్తము బాగుగా ప్రసరించును. దీనికి తోడు పథ్యమైన యాహారము భుజించిరేని, యొక నెలదినములలో వారి నెవ్వరు నానవాలు పట్టజాలరు. వారిదేహము చక్కగా నిర్మితమగును, జీవితము సంతోషదాయక మగును, ఉత్సాహము గలుగును, కామేచ్ఛ సహజస్థితికి వచ్చును. అయ్యది మార్పు జెందక నెపుడును సహజస్థితియందుండదని తెలిసికొనుడు. మన యభ్యాసములను బట్టి యది మారుచుండును.

కామ మొక "విచిత్రమైన కల్పితవిషయమ"ని యనేకులు చెప్పుదురు: కాని ప్రేమవలన నుద్భవించు మనోవికారములను చింతనజేసి వాని మూలము కనుగొన యత్నించితిరేని పైయభిప్రాయము చప్పని శాస్త్రసిద్ధాంతమని తేలును.



మానవులకీ ప్రేమ ప్రవృత్తి యొక ప్రత్యేకోద్దేశముతో బ్రసాదింపబడినది. ఇది యెల్ల రెరింగినవిషయమే. దాని కార్యములు, దాని యుద్దేశములు నెల్లరకు విశదమే. ప్రేమోద్దేశములను జక్కగ గ్రహింపగలిగినప్పుడే దాని ననుసరించు బాధ్యతలను వహింపగలిగినపుడే పరిపూర్ణానందము గలుగును.

కామము తృణీకరింపదగినదని, యాటగా వ్యవహరింపదగినదని, సుఖసంపాదనమునకు క్షణిక సాధనముగా నుపయోగించుకొని పిదప విడువదగినదనియు ననేకుల యభిప్రాయములు. ఈ విధముగా కామమును దుర్వినియోగపరచువారెల్లరు పెద్దతనము వచ్చినకొలదిని వారి యభిప్రాయములను మార్చుకొనవలసియుందురు. ఈ భూమియందు ప్రతి మానవుడు నొకానొక కార్యముకొఱకున్నాడు. ప్రతివాడు నిర్వర్తింపదగిన విధాయకములు కొన్నిగలవు. ప్రతివాడును వానివాని ప్రత్యేక ప్రవృత్తి ననుసరించుట కాజ్ఞాపింపబడుచున్నాడు. పూర్ణారోగ్యమును నట్టి యారోగ్యసూచకమగు క్రమమైన కామేచ్ఛయు గల స్త్రీయొక్క జీవితము కొన్ని క్రమములతో నడచును. ఆమె క్రమముతప్పినచో నది యామెముప్పునకే యగును పురుషుని విషయములోను సరిగా నింతియే. స్త్రీగాని, పురుషుడుగాని, స్వాభావికజీవితమునుండి దూరమైనకొలదిని దానికి తగిన శిక్ష ననుభవించితీరవలయును. కేవలము ప్రాణాధారమై, ముఖ్యమైన యీ విషయమును గూర్చిన జ్ఞానము లేకపోవుటవలన వర్ణించి చెప్పుటకు మానవుని శక్తి చాలనంత ఘోరముగ లోకమంతయు దుఃఖమయమైయున్నది. ఈ పవిత్రవిషయమునుగూర్చి జనసామాన్యము

నను బోధించుటకు యత్నించుటవలన నేడు నేనొక నేరస్థుడనయితిని. నేను నేరముచేసినట్లు న్యాయస్థానములు తెలియజేయుచున్నవి. ఇది నాగరికతయట! మనము శ్రేష్ఠతరమైన జనులమట! జ్ఞానవంతులమని, యభివృద్ధి నొందుచున్నామని మనమూరక యనుకొనుచున్నాము. మానవజాతి మనోదృఢము లేక, ఇంత బలహీనముగా, నింత యస్వాభావికముగా నున్నదనిన వింతయేమున్నది! చిన్నపిల్లలుగా నున్నపుడు తెలిసికొనవలసిన సామాన్య ధర్మముల నీకాలమున మగపిల్లవాడుగాని, యాడుపిల్లగాని పెద్దవారై ప్రాణశక్తిలో కొంత భాగమును (పురుషత్వమునుగాని, స్త్రీత్వమునుగాని) గోల్పోయి నరములను హింసించు భయంకరానుభవములద్వారా తెలిసికొనుచు బాల్యదశను దాటుచున్నారనుట వింతయా! చాల ముఖ్యమగు నీ విషయిక జ్ఞానాభావమువలన స్త్రీగాని, పురుషుడుగాని కొంత యారోగ్యమును, తమ స్త్రీత్వమందును పురుషత్వమందును కొంతభాగమును బలియివ్వనివారు లేరు. విజ్ఞానము కొఱకు పడవలసిన బాధను నేనెరుగుదును. సాధారణముగా ప్రతి మనుష్యుని ముఖముమీద నీ కారణమువలన గలిగిన ముడుతలు వాతలువేసినట్లు కనుబడుచుండును. నిజమైన జ్ఞానాభివృద్ధి కత్యంతావశ్యకత గలదు. ఈ దేశమున నిక్కాలపు స్త్రీపురుషులకంటె భావికాలపువారు శ్రేష్ఠతరులై యుందురని నా నమ్మకము. ప్రతి మనుష్యుడు మానవజాతికంతటికి ప్రబలుడగు ప్రతినిధిగా నుండవలయును. ప్రతి స్త్రీయు సుందరముగాను, దివ్యమైనదిగా నుండవలయును. మన విద్యాలయములను జూడుడు! మన నగర పాఠశాలలో



నికి వెళ్లుడు! విద్యార్థులకు నియమింపబడిన గ్రంథములందాయము వివిధములగు విచిత్రవిషయములతో క్రిక్కిరిసియుండుటను మీరు చూడగలరు. కాని ప్రాణాధారమగు నీ విషయమునుగూర్చి యొక మాటయైన కనబడదు. ఈ విషయములను బోధింపవలసిన విధాయక మెవరిదో అట్టి యుపాధ్యాయు లనేకు లీవిషయములు నీచమైనవనియు, అసహ్యకరములనియు జెప్పుదురు. ఇట్టి బోధకులమూలముననే ఈదేశము హీనులతోను, భ్రష్టులతోను నిండిపోవుచున్నది. ఇటువంటి స్త్రీపురుషులమూలముననే వర్ణనాతీతమగు బాధను మనము పొందుచున్నాము.

ఈశ్వరరాజ్యమున పరమసుందరవస్తువగు నీ మానవ దేహమును నీచమైనదని వారు సమర్థించుచున్నారు. ఒకింత యోజించిచూడుడు! దేహము నీచమైనదా? అసహ్యకరమైనదా? మానవ దేహధర్మమను రాజ్యములో యీ ప్రపంచములో నున్న ధన మంతటికంటె విలువగల జ్ఞానమున్నది. లోకములోని శ్రేష్ఠతరమగు నైశ్వర్యము నిచ్చినను, యీ విషయమునుగూర్చి నాకు తెలిసినసంగతిని చెప్పను. రాక్ఫెల్లరు (Rockfeller) తన లక్షల ధనమును ఖర్చుపెట్టినను యీ విషయికమగు జ్ఞానములో కొంతభాగమైనను కొనజాలడు. మానవసౌఖ్యముతో పోల్చిచూచినపుడు ధనము మిక్కిలి స్వల్పమైన దగుచున్నది. ఎవరు తమ జీవితకాలమును పెంపొందింపజూతురో వారు కామేచ్ఛను భద్రముగా నుంచుటవలన గలుగు ఫలితములను దెలిసికొనవలయును. పల్కావలుకకుండ దాని యాజ్ఞను పట్టుదలతో ననుసరించిన యెడల మరల మరల నధికముగా ప్రతిఫలము నొందనగును.

తుదకు తేలిన యీ యంశముల నంగీకరించి, స్త్రీపురుష జాతి (కామ) సంబంధమైన ధర్మములకు తమంతటతా మల వాటుపడినవారు సైతము, వారి సిద్ధాంతముల ననుసరించి నడుచుట కప్పుడప్పుడు కష్టపడుచుందురు. ఒడంబడిక కిరుపుర కావలయును. ఒక్కొకపుడు ఒప్పందము చేసికొనిన యిరుపక్ష ములవారికి యిట్టిమృదువిషయములలో పూర్ణాంగీకారముండు టకుదు. మనము యత్నము చేయవలయును, యత్నము చేయు చునే యుండవలయును, మనము కొన్ని పొరపాటులను జేసి నను బలమును సంపాదింపవలయునను నిశ్చయముతో పాటు బడినచో, సంవత్సరము తరువాత సంవత్సరము దానిని పొంద గల యవకాశము మనముందు ప్రకాశించును. పండ్లు పటపట గొరుకుచు యుద్ధముజేయుచునే యున్నచో జయము సిద్ధించును. స్త్రీ యొక్కగాని, పురుషుని యొక్కగాని మెదడునందు అత్యంత సామర్థ్యము నిహితమై యుండుటవలన జయము లభించుననుట నాశ కలదు. ఈవిధముగా జేసెదను, అని నిశ్చయించుకొని అట్టి ప్రయత్నముతో సదా పరిశ్రమము జేయు చున్నచో స్త్రీపురుషు లెల్లరును గాంచదగిన విజయములలో కెల్లను గొప్పదియగు తనను తాను పాలించుకొనగలుగు స్థితి లభింపగలదు. పోరాటము సలుపవలసియున్నను, భయంకర మగు కష్టములకు లోనుగావలసియున్నను దానివలన గలుగు లాభము వేయిరెట్లెక్కువ విలువగలదై యున్నది. తుదకు నేజెప్పున దేమనగా మీవిషయమునుగూర్చి మీరు కొంత తెలిసి కొనుడు, మనసునుగూర్చియు మనము తెలుసుకొనవలయును.



మన విషయమునను, మనచుట్టు నున్నవారి విషయము నను మనము చేయవలసిన విధాయకములను మనను గుర్తింప వలయును. ముఖ్యముగ స్త్రీలుగాను, పురుషులుగాను కానున్న యాడుపిల్లలయెడలను మగపిల్లలయెడలను మనకుగలవిధులను మన మెరిగియుండవలయును. అదియే మనము కట్టబోవు భవన మునకు పునాది. శిల్పకారుడు విగ్రహమును మలచినట్లు భావి జాతి నిర్మాణముగావించుట కిప్పటి పిల్లలే సరియైన వస్తువులు. కాలక్రమమున మీయుద్దేశములను మీబిడ్డలద్వారా ప్రకటింప వచ్చును. వారినిపూర్ణమైన, శ్రేష్టతరమైన స్త్రీత్వమునకును పురు షత్వమునకును, నిదర్శనులనుగా జేయవచ్చును. సమాప్తము.

## వ్యాస సారాంశము

కామెచ్ఛ దుష్టమైనదికాదు. కల్పితమైనదియు కాదు. ఆరోగ్యవంతుల కామేచ్ఛ స్వాధీనములో నుండును. అది అన్యోన్య ప్రేమపాశబద్ధులై జీవితాంతమువఱకు నొకరి నొకరు విడువకుండనుండునట్లు దంపతులను నడపును. ఆరోగ్యవంతుల కామేచ్ఛ పవిత్రమైనది. కామేచ్ఛ పలువురు తలచునట్లు హేయమైనది కాదు. అనారోగ్యశరీరులు అమిత భోగప రాయణులు దానిని హేయమైనదానినిగ చేయుచున్నారు. కామేచ్ఛ ప్రత్యే కోపయోగార్థము సృష్టికర్తచే సం కల్పింపబడిన నిర్దిష్ట ప్రవృత్తియై యున్నది. మనుష్యుల యవివేకము, అతిభోగపరత్వముచేరి దానిని నరక ద్వార మునుగా మార్చివేయుచున్నది. అస్వాభావి కాహారసేవనము, అస్వాభావిక జీవనము, ప్రేమప్రధానము కాని వివాహము

అమితలోలత యీ నాలుగు కారణములచే సౌఖ్యదాయిని కావలసిన కామేచ్ఛ వికృతరూపమును ధరించి దుఃఖపరంపరకు హేతుభూత మగుచున్నది. సహజాహార సేవనము, శరీరవ్యాయామము, చెన్నీటిస్నానము, పరిశుభ్రత, సత్సహవాసము, ప్రేమమూలకమగు వివాహము ఇవన్నియు కలసి కామేచ్ఛను నియత నిర్మల ప్రవృత్తినిగా ప్రదర్శించి ఈశ్వరేచ్ఛను నెరవేర్చ గల్గును. ఈయంశములు విపులముగ తెలుపబడి భావి జననీ జనకులు కాబోవు బాల బాలికల విజ్ఞానము వృద్ధి నొందవలయును. కామసంబంధములును, శరీరసంబంధములును నగు విషయములు అపవిత్రము లనియు రహస్యము లనియు భావించి చిన్నవారికి వానినిగూర్చి తెలుపకపోవుటచే మితిమీరిన చేటువాటిల్లుచున్నది. శరీరము దేవమందిరము. కామాదిప్రవృత్తులు భగవదిచ్ఛాప్రేరితములు. మన మారోగ్యవంతులమైయున్నచో నీమనోవృత్తులు కేవలము దేవదూతలై మన గృహములలో తల్లిదండ్రులు శారీరకశాస్త్రజ్ఞాన సంపన్నులై బాల బాలికామర్మముల నెల్లం దెలుపవలయును. ఎక్కడ జూచినను లెక్కకు మిక్కిలిగనుండు నిక్కట్టులం దొలగించి మానవజాతి నుద్ధరింపవలయుననిన బాల బాలికల కట్టి పరిజ్ఞానమునుకలిగించుటత్యవసరము. అది జీవితపరమార్థమును చేకూర్చ నేర్పును. మనమారోగ్య హీనులమైయున్నచో నివియే పెనుభూతములై మనను పీడించి నిరర్థకజీవులనుగా జేసివేయును. సంగతులు పిల్లలకు బాగుగ బోధపడునట్లు పాఠశాలలలో నేర్పవలయును.

## మా వద్ద వెలకు దొరకు గ్రంథములలో కొన్ని
## మొత్తము 65 గ్రంథములు.

---

### సూర్యకిరణచికిత్స.

| | | |
|---|---|---|
| సునిశితవైద్యము | సూర్యకిరణచికిత్స | వర్ణచికిత్స |
| ప్రౌఢప్రభాకరము | వర్ణవైద్యమంజరి | వర్ణవైద్యము 1,2 భాగములు. |

### జలచికిత్స.

| | | |
|---|---|---|
| లక్ష్మణజలచికిత్స | స్వాభావిక చికిత్సా | ఉషఃపానము |
| నైప్పీయజలచికిత్స | నియమములు | రక్తప్రక్షాళనచికిత్స |
| తొట్టిస్నాననియమములు | జస్టుచికిత్స | కూనేమహాశ చరిత్రబోధ |
| వేడినీటికాపు | తొట్టివైద్యము | రక్తశోధనచికిత్స |

### ఇతరచికిత్సలు.

| | | |
|---|---|---|
| ఉపవాసచికిత్స | యోగచికిత్స | క్షీరచికిత్స |
| ధ్యానచికిత్స | సంవాహనచికిత్స | జంబీరచికిత్స |

### వ్యాధులకు చికిత్సలు.

1 క్షయ, 2 మలబద్ధకము, 3 శుక్లనష్టము 4 ప్రకృతిచికిత్సార్ణవములు (7 భాగములు) (వీనిలో అన్ని వ్యాధులకు అన్నిరకముల చికిత్సలును తెలుపబడును.) 5 దీర్ఘరోగచికిత్సాసారము

### ఆహారము మీద పుస్తకములు.

1 నిర్విచారభావిజీవనము (కొబ్బరినిగూర్చి) 2 పచ్చితిండివలనిప్రయోజనములు 3 అపక్వశాకాహార అద్వైతసిద్ధాంతము 4 ఆహారము (2 భాగములు) 5 సమరసాహారము,విరుద్ధాహారమిశ్రమము 6 ఆహారసమ్మేళనపుగోల.

ఇంకను ఆరోగ్యవిషయములమీదను వేదాంతముమీదను పుస్తకములు గలవు. పూర్తివివరములకు కేటలాగునకు వ్రాయుడు.

---

మేనేజరు, ప్రకృతికార్యాలయట్రస్టు, బెజవాడ.

# సునిశితవైద్యము

సునిశితములగు జలచికిత్స, మృత్తికా చికిత్స, విద్యుచ్ఛికిత్స, కాంతశక్తితో చేయు చికిత్స, వర్ణచికిత్స, సూర్యోపాసన, మంత్రచికిత్స, యోగనిద్రాచికిత్స, పవనచికిత్స, భక్తివిశ్వాసచికిత్స మొదలగునవి యిందు విపులముగా వివరింపబడినవి. గ్రహింప సాధ్యముకానివిగా వదలివేయుబడిన అనేక విషయములు శాస్త్రీయముగా వివరింపబడినవి. ఇది డాక్టరు ఈ. డి. బ్యాబిట్, ఎం. డి., ఎల్ ఎల్. డి. గారిచే ఆంగ్లేయ భాషలో వ్రాయబడిన ప్రసిద్ధవైద్య గ్రంథమునకు డాక్టరు పుచ్చా వెంకట్రామయ్య, ఎన్.డి., డి. యం. గారి భాషాంతరీకరణము. అచ్చుపూర్తి అయినది. 750 పుటలు. 100 చిత్రపటములు. మంచి డబిల్ క్రౌన్ 28 పౌనుల గ్లేజు కాగితములపై నూతనఫక్కిని ముద్రింపబడినది. మంచి నిండు క్యాలికో బైండింగు చేయబడినది. వెల రు 4-8-0. నిండుతోలు ఫ్లెక్సిబిల్ బైండింగు ప్రతి 1 కి రు 5-0-0. పోస్టేజి ప్రత్యేకము. ప్రకృతిచందాదారులకు ప్రతికి రు 1. చొప్పున తగ్గింపు. గ్రంథ విషయసూచిక కోరినవారికి పంపబడును.

మేనేజరు,

ప్రకృతి కార్యాలయ ట్రస్టు - బెజవాడ.

